# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 20
16–5–1986
శుక్రవారం
12 పేజీలు: రూపాయి


# చంద్రబాబుదే పైచేయి అయింది!

మా హైదరాబాదు విలేఖరి

కొండంత రాగందీసి కుమ్మెర పదం పాడినట్లయింది- రాష్ట్ర మంత్రివర్గ విస్తరణా కార్యక్రమం. ఎందువల్లనో, ఎప్పుడూలేనిది దీనికి విశేష ప్రచారం కల్పించారు ముఖ్యమంత్రి అసమర్థులు గానో, అవినీతి ఆరోపణలకు గురైనవారు గానో పేరుపడ్డ కొందరు మంత్రులను తొలగిస్తున్నామన్న అభిప్రాయం కల్గించారు; పలువురు కొత్తవారికి అవకాశం కల్పిస్తున్నట్లు ప్రచారం చేశారు; ఎమ్మెల్యేలందరికీ తంతి సందేశాలుపంపి, పిలిపించారు గూఢచారి శాఖ ద్వారా ఎవరెవరి వివరాలో సేకరించారు; హైదరాబాదులో ఏదో పెను రాజకీయ తుఫాన్ రానున్నదన్న భ్రమ కల్పించారు; ముఖ్యమంత్రి స్వయంగా విజయవాడ పత్రికలవారి దగ్గర ఇటువంటి సూచనలి చేశారు- ఇంగాచేసి 14 వతేది మంత్రివర్గ విస్తరణను మాత్రం తుస్సు మనిపించారు.

నిజానికి ముఖ్యమంత్రికి తన మంత్రివర్గ విస్తరణలో ఏ మాత్రం స్వేచ్ఛ లభించివుండినా, ఈ కార్యక్రమం ప్రచారానికనుగుణంగానే వుండేదని పరిశీలకుల నిశ్చితాభిప్రాయం. ఆఖరి నిముషంలో అఘమేఘాలమీద ఊడిపడిన చంద్రబాబునాయుడు మామగారి మెడలు వంచి, మొత్తం ప్రణాళికనే తిరకాసు చేశారని రాజకీయవర్గాలు భావిస్తున్నాయి.

అవినీతి ఆరోపణలు వచ్చిన యతిరాజరావు వంటివారిని, అసమర్థులుగా పేరుపడిన అయ్యన్నపాత్రుడు, రాజేశం గౌడ్, ఫరూఖ్ వంటి వారిని తొలగించి, ఆస్థానంలో యువకులనునియమించాలనే కోరిక ఎన్.టి.ఆర్.లో చాలాకాలం నుంచి వుంది. మొన్నటి అసెంబ్లీ సమావేశాలలో మంత్రుల చాకచక్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసుకున్న తర్వాతనే ఆయన ఈ నిర్ణయానికి వచ్చారు. తన నిర్ణయం అమలుకు 14 తేదిని ముహుర్తంగా నిర్ణయించుకున్నారు. ప్రధానకార్యదర్శికి,శ్రీ విజయరామరావుకు విషయంచెప్పి. ఏర్పాట్లకు ఆదేశించారు. ఇది జరిగేటప్పుడు చంద్రబాబు నాయుడు కాకినాడలో వున్నారు. అధికారులు ఫోనులో 12 తేది ఆయనకి విషయం తెలియచేశారు.

ఉన్నపాటున విజయనగరం తదితర నిముషంవరకు ఎన్.టి.ఆర్. చేసిన యత్నం విఫలమైంది.

అప్పటికప్పుడు వెంకటేశ్వరరావును పిల్చి 'సారీ' చెప్పారట ఎన్.టి.ఆర్; ఆయన పెదవి కదపకుండా తిరిగి వెళ్ళిపోయారు తీసివేయాల్సినమంత్రులు,తీసుకోవాలనుకున్న మంత్రులజాబితామొత్తం చెత్తబుట్టపాలైంది.ప్రకటించినసమయానికి ఏదోఒకటి జరగాలికాబట్టి హడావుడిగా నలుగురిచేత ప్రమాణస్వీకారం చేయించారు. మహానాడుతర్వాత పార్టీపై తనకుగల పట్టును ప్రదర్శించడానికి చంద్రబాబుకు ఈ సంఘటనలు ఎంతో ఉపకరించాయి.

అయితే, వెంకటేశ్వరరావుకు మాత్రం ఇది తీరని అవమానం. అయనతోనేకాదు,



మామ మెడలు వంచాడు

ఆయన కుటుంబ సభ్యులకుకూడా ఎన్.టి ఆర్. మంత్రి పదవి ఇస్తున్నట్టు చెప్పాడట. అందువల్లే వెంకటేశ్వరరావు ఎంతో

— కొరవ 7 వ పేజీలో

చంద్రబాబు చక్రం అడ్డువేయకుంటే వెంకటేశ్వరరావు మంత్రిఅయ్యేవాడు

★ ★ ★

అసమర్ధ మంత్రుల తొలగింపు ఆగిపోవడానికి కారణమేమిటి?

★ ★ ★

బాబును దూరంగా పెట్టడానికి ఎన్టీఆర్ చేసిన ప్రయత్నం విఫలమైందా?

ప్రాంతాల పర్యటనను రద్దుచేసికొని చంద్రబాబు హైదరాబాదుకు గగన మార్గంలో విచ్చేశారు వచ్చేసరికి, కొత్త మంత్రులలో వెంకటేశ్వరరావు పేరు కూడా వుందని తెలిసింది. అంతే నేరుగా వెళ్లి మామగారి కాళ్లమీద పడిపోయారట. వెంకటేశ్వరరావును చేర్చుకుంటే పార్టీ [illegible] లో ఏహ్యభావం పెరిగిపోతుందని చెప్పారట; మండలాల ఎన్నికలలోగా మంత్రులనుతీస్తే అసంతృప్తి పెరిగి, ఆత్మహత్యా సదృశమౌతుందని మొరపెట్టుకున్నారట; దాదాపు రెండు గంటలసేపు హోరాహోరి వాగ్యుద్ధం జరిగిన తర్వాత, మామగారు మెడలు వంచక తప్పలేదు [illegible] చివరి [illegible] లో [illegible] దూరంగా [illegible]

# మూడు నిమిషాల ముచ్చటకు ఎంత ఆడంబరం? ఎంత దుబారా?

"మీ ఇంట్లో పెళ్ళి; మేమురావటం ధర్మం కావి. మీకెందుకిక్కడిదాకా వచ్చారు", ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు నెల్లూరు పోలీస్ పెరేడ్ గ్రౌండ్స్‌లో దిగగానే నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డినుద్దేశించి అన్నతొలిమాట ఇది.

ఆయనమాటను, ఒక్క రెవిన్యూ మంత్రికేకాదు, మొత్తం జిల్లా అధికార యంత్రాంగమంతటికీ అన్వయించుకో వచ్చు.

రెవిన్యూమంత్రి కుమారుడి పెళ్ళి కోసం వచ్చారు, ముఖ్యమంత్రి; పూర్తిగా వ్యక్తిగతమైన కార్యక్రమమిది. ఇతర ప్రోగ్రాముకూడా ఏమీలేదు. 12 తేది ఉదయం 10-10కి హెలికాప్టరు దిగారు; 10-45 కి తిరిగి ఎక్కారు. మధ్యలో

## ముఖ్యమంత్రి నెల్లూరు పర్యటన ముచ్చట్లు

అయనచేసినపనల్లా కళ్యాణమండపానికి వెళ్లివధూవరులపై అక్షింతలుచల్లిరావడమే. ఇంతచిన్న కార్యక్రమానికి ఎంత హడావుడి? ఎంత అర్భాటం? ఎంతఖర్చు? అధికారులకు ఎంత ప్రయాస? ఎంత స్వాగతాడంబరం?

జనం విరగబడి వస్తారనుకున్నారు కాబోలు. పోలీసు పెరేడ్ గ్రౌండ్స్అంతా బారికేడ్లు కట్టారు. కానీ ఒకమూల పచ్చ జెండాలు పట్టుకుని నిలబడిన రమేష్‌రెడ్డి శిష్యగణం తప్ప, గ్రౌండంతా ఖాళీయే! కొన్ని వందల మంది పోలీసులను కళ్యాణ మండపంవరకు నిలబెట్టారు. గ్రౌండ్‌లో, కళ్యాణ మండపం దగ్గర రెండు తాత్కాలిక వైర్‌లెస్ కేంద్రాలే నెలకొల్పారు. ఆర్ అండ్ బి అతిథి గృహం దగ్గర అర్భాటం చెప్పనే అవసరంలేదు. అన్నిటినీ మించి గంటకు పాతికవేల రూపాయల పెట్రోలు త్రాగే ఐరావతంవంటి హెలికాప్టర్ వుండనే వుండనేవుంది.

—కొరవ 11 పేజీలో

## పాపం, హోం మంత్రి!

ముఖ్యమంత్రి, ప్రధాన మంత్రి వంటి వి ఐ పీ లు వచ్చిన సందర్భంలో పత్రికలవారిని, ప్రజలను అవమానించడం మంత్రులకు సరదా, అధికారులకు వినోదం. 12 తేది ముఖ్యమంత్రి వచ్చినప్పుడు ఆ అనుభవం సాక్షాత్తు హోం మంత్రికే ఎదురైంది.

అన్నగారు హెలికాప్టర్ దిగి కారెక్కిన తర్వాత, వెనుకవున్న మరొక కారులో హోం మంత్రి వసంత నాగేశ్వర రావు ఎక్కి కూర్చున్నారు. అయితే ఆ డ్రైవరెవరోగాని, కాన్, నా కారులో ఎక్కడానికి నువ్వెవరవని మంత్రింతటివాణ్ణి గద్దించి, దబాయించి, క్రిందకు దింపేశాడు; తర్వాత ఎవరో వచ్చి ఆయనెవ్వరో చెప్పారు; పోయిన పరువు నిలబెట్టారు.

ఇంతకూ ఈ కారెవరిదనుకున్నారు! ముఖ్యమంత్రి వెంట రక్షణకోసం ఏర్పరచిన పోలీసు ఎస్కార్టు ట్యాక్సీ!

## న్యూస్ పొయిట్రీ

### వెంకటేశ్వర సర్వదర్శనం!!

సర్వదర్శనం క్యూలో నేను
గర్వప్రదర్శనం వ్యూతో నీవు....

వేలాది భక్తులు తోడుగా
ముకుళిత హస్తాలతో
ముందుకు సాగుతున్న నేను
చేతిలో మంత్రిగారి
సిఫార్సు లేఖతో... 
ఒంటరిగా నీవు....

కంటకావృతమయిన
కీకారణ్య మార్గంలో
ఏడుకొండల నడుమ
కాలిబాటన నడచివచ్చి
తిరుమల నడివీధిలో
నిలుచున్న నేను

కారులో షికారుగా
ఘాటురోడ్డు పెద
నీటుగా ప్రయాణించి
కాటేజీలో విశ్రాంతి
తీసుకున్న నీవు....

నా అంతరంగం
భక్తిభావ పులకాంకితం
నీ ఆలోచనా తరంగం
ప్రతిఫలాపేక్షతో కళంకితం!

### చిల్లర సమస్య??...

చిల్లరసమస్య
రోజురోజుకు పెరిగి
అల్లరిపాలుచేస్తున్నది;
కాఫీహోటలు, క్యాంటీను
క్లాత్‌షాపు-కూరలమార్కెట్టు
పండ్లదుకాణం ప్రతిచోటా
ఎక్కడికయినాపో....
చిల్లర చేతిలోలేకుంటే
చిన్నచూపు;
మూట చిల్లరతో
జోరుగా సాగుతున్నది
ప్రతిరోజూ కమీషను వ్యాపారం;

—జి. ఆర్. పెదకొమ్మ.

# జమీన్‌రైతు

## విస్తరణ ప్రయోజనం?

మరొకసారి కేంద్ర మంత్రివర్గ విస్తరణ జరిగింది. రాజీవ్ గాంధీ 85 ఎన్నికల తర్వాత తన మంత్రివర్గంలో మార్పులుచేయడం ఇది ఎన్నోసారో చెప్పలేము. మొన్నటికిమొన్న సెప్టెంబరులో, పార్లమెంట్ సమావేశాలు కాగానే ఒకసారి మంత్రివర్గ విస్తరణ చేశారు; ఇప్పుడు మళ్ళీ!

తాజా విస్తరణలో మొత్తం 13 మంది కొత్తవారికి స్థానం లభించింది. ఇందులో క్యాబినెట్‌స్థాయి ఇద్దరికి. 9 మంది స్టేట్ మంత్రులు, ఒకరు డిప్యూటీమంత్రి. విదేశీవ్యవహారాల మంత్రి శ్రీ బి. ఆర్. భగత్‌ను మంత్రివర్గంనుంచి తొలగించారు.

ఎప్పుడూలేనిది, ఈ మంత్రివర్గ విస్తరణ అన్నివైపుల నుంచి విమర్శలను ఎదుర్కొంటూంది. మంత్రివర్గంలో మార్పులు, ప్రధాని ఇష్టానుసారం జరుగుతాయి. రాజ్యాంగబద్ధంగా సంక్రమించిన అధికారం ఇది. దాన్నెవరూ ప్రశ్నించడానికిలేదు. అయితే మంత్రివర్గం అంటే దేశంలో పరిపాలనకు బాధ్యతవహించేవ్యవస్థ. అది సక్రమంగా లేనప్పుడు, నిరసనను లేదా తమ అభిప్రాయాన్ని వ్యక్తంచేసే హక్కు ప్రజలకుంటుంది. మంత్రివర్గంలో జరిగే మార్పులు ప్రధాని అనుకూలతకే కాదు, జాతి ప్రయోజనాలకుకూడా అనుగుణంగా వుండాలి.

ఈ దృష్టితో చూసినప్పుడు, ఇప్పటి మంత్రివర్గ విస్తరణ అంత సమంజసంగా జరగలేదన్నది వాస్తవం. సమకాలీన పరిస్థితులలో అత్యంత ప్రాధాన్యతకల్గిన హోం, విదేశీవ్యవహారాల శాఖలను ఆయన కదిలించారు. ఇండియా ప్రస్తుతం అలీనోద్యమసంస్థ ఛైర్మెన్ కాబట్టి, మన విదేశీమంత్రిపై ప్రపంచదృష్టి కేంద్రీకృతమైవుంటుంది. ఆ పదవిలోవుండేవ్యక్తి అత్యంత లౌకికుడు, సరసభాషణాచతురుడు, దౌత్యనిపుణుడుగా వుండాలి. కానీ రాజీవ్‌గాంధీ ఆ బాధ్యతను శివశంకర్‌కు అప్పగించారు. శివశంకర్ మంచి న్యాయవాది, గొప్ప రాజకీయ నిపుణుడు కావచ్చుకాని, దౌత్యవేత్త కానేకాదు. ఆయన సంభాషణలు అత్యంత కటువుగా వుంటాయి. అప్రియం విన్నప్పుడు ఆవేశం అణచుకోగల నిగ్రహం, సంయమనం ఆయనలోలేవు.

అంతేకాదు, విదేశీవ్యవహారాలతోపాటు, వాణిజ్యశాఖకూడా ఆయనకే అప్పగించారు. ఇవి రెండూ విడివిడిగా సముద్రమంతటి శాఖలు. వాటికి వేర్వేరు మంత్రులుండాలేతప్ప, ఒకరే రెండింటినీ నిర్వహించడం అసాధ్యం.

హోంశాఖను శ్రీ బూటాసింగ్‌కు కట్టబెట్టారు. బూటాసింగ్ ప్రధానికి అత్యంత విధేయుడు; శిక్కు తీవ్రవాదులకు లొంగని ధీరోదాత్తుడు. కానీ, పంజాబ్‌లో, కాశ్మీర్‌లో, ఈశాన్యభారతంలో అత్యంత సంక్లిష్టంగావున్న శాంతిభద్రతల పరిస్థితిని చక్కదిద్దే సమర్థత ఆయనకున్నదా? మతంనుంచి వెలివేయబడిన ఆయనతో బర్నాలా ప్రభుత్వమైనా సహకరిస్తుందా? సాఫీగా సంప్రదింపులు జరపగల్గుతుందా?

ఇప్పుడు కొత్తగా చేర్చుకన్న 13 మందిలో అత్యధికులు, ఒకప్పుడు ఇందిరాగాంధీకి విధేయులు. రాజీవ్‌గాంధీ తన తల్లి అనుయాయులను విస్మరిస్తున్నారన్న అసంతృప్తి పార్టీలో వుంది; మొన్నటి ప్రణబ్ ముఖర్జీ ఉదంతంకూడా దీనినుంచి పుట్టినదే! పార్టీలో ఇది పెద్ద సమస్యగా పరిణమించకుండా వుండేందుకు, వీరికి అవకాశం కల్పించినట్లున్నారు.

విదేశీవ్యవహారాలమంత్రి బి. ఆర్. భగత్‌ను ఇంత అర్ధాంతరంగా ఎందుకు తొలగించారో ఎవరివూహకు అందడంలేదు. ఆయన చేసిన తప్పులేమిటో ఎవరికీ తెలియవు.

అసలు ఈ మంత్రివర్గ విస్తరణద్వారా, రాజీవ్‌గాంధీ పార్టీపరంగా, పరిపాలనాపరంగా సాధించిన ప్రయోజనం ఏమిటోకూడా తెలియకుండేను.

## జమీన్‌రైతు

22.5.1936

### నెల్లూరు చిత్రవార్తలు

అబ్బా! యెన్నాళ్ళకు ఖాన్ బహదూర్ యాహ్యాలిసాహెబ్‌గారికి జిల్లాజడ్జి ఉద్యోగం లభ్యమైంది!

* * *

ఫలమున్నా, భాగ్యమున్నా తప్పదంటారు పెద్దలు. కాకుటూరు లింగారెడ్డిగారికి ఈ ముసలి ముప్పందాన పుత్రోదయమైంది. తాలూకాబోర్డు లుంటే ఈ శుభవార్తకు మ్రొక్కుళ్ళు మూసివుందురు.

* * *

సూళ్ళూరుపేట యక్కు రైల్వే పి. డబ్ల్యు. డి. ఇన్‌స్పెక్టర్‌గారి భార్యగారికి 12 కాన్పులు, 24 మంది సంతానం. ప్రతికాన్పుకు అమడలే. ఇద్దరుమాత్రమే నష్టం. 22 మంది సజీవులైయున్నారు. వీరిప్పుడు గుంతకల్లులో నున్నారు.

* * *

గత జిల్లాబోర్డు ఎన్నికల్లో ఒకానొక వ్యక్తికి ఫ్రాంచిబుద్ధ ఖర్చు రు 1500 దాకా అయిందట. ఇది టెంపరెన్సు ప్రావగాండా ఫలితం కాబోలు.

* * *

అచ్చుబద్ధ గుప్తపందాంగంలో ఉప్పుధరలు హెచ్చుతవన్న ఘట్టాన్ని నమ్మి ముత్తుకూరు రెడ్డిసోదరులొకరు రు 4000 లకు ఉప్పుకొని, ఏట్లో పోశారు తెక్క బెట్టిరూపాయలు, పాపం!

### 50 ఏళ్ల క్రితం ఈవారం

#### నెల్లూరు ముచ్చట్లు

రామిరెడ్డిగారు (తిక్కవరపు రామిరెడ్డి) చేయిచేసుకోకుంటే పాతపార్టీలన్నీ భగ్నమై కొత్తమురాలుగా చీలేట్టుంది. లక్ష్మయ్యగారి ప్రయత్నం (రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు, మునిసిపల్ ఛైర్మెన్ పదవికి చేసేయత్నం) మాత్రం కొత్త వ్యాజ్యగాడిమాదిరి చురుగ్గా సాగుతోంది. రామిరెడ్డిగారు విరిస్తే నేను మానుకుంటానంటున్నారట. రామిరెడ్డిగారి దృష్టి ఎలావుందో వస్తేగాని తెలదు. ఈ ప్రయత్నం మీదే లక్ష్మయ్య మద్రాసుకూడా వెళ్లారట.

* * *

(ద్రౌపది) మానసంరక్షణం ఫిలిం నెల్లూరులో ప్రదర్శించడానికిమాత్రం హైకోర్టువారు 20 తేదీ పర్మిషన్ ఇచ్చారు. ఈరోజునుండి నెల్లూరులో ప్రారంభమైంది.

#### జమీన్‌రైతు పత్రికపై పరువునష్టం దావా

నెల్లూరు సెంట్రల్ ఇండియన్ డ్రగ్ స్టోర్సుప్రొప్రయిటర్‌పుచ్చలపల్లి వెంకటసుబ్బారెడ్డిగారు, జమీన్‌రైతు పత్రికా సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడైన నెల్లూరు వెంకట్రామానాయుడుగారిమీద నెల్లూరు డిప్టీ మేజిస్ట్రేట్‌గారి కోర్టులో సిసి 44 ఆఫ్ 36 న ఐపిసి 500 సెక్షన్‌ప్రకారం జమీన్‌రైతు పత్రికలో తమ్మగూర్చి వ్రాసిన కొన్నివ్రాతలవలన తమకు పరువునష్టం కలిగినదని మే 22తేదిన కంప్లయింటు దాఖలుచేసిరి. ప్రమాణ రైపీదుకూడా తీసుకోబడెను. ఫిర్యాది పక్షమున అధ్యక్షంవారివీధి కావురస్తులుగండికోట శ్రీసంజీవరావు న్యాయవాదిగారు హాజరైరి.

## రైతు బ్రతుకులో మార్పురాదా?

రైతుపండించే వడ్లను అప్పుకుకొని రైస్‌మిల్లర్లు లక్షలార్జిస్తున్నారు; రైతు పండించే కందులు, పెసలు, మిరపకాయలు వ్యాపారులు కోట్లకు పడగలెత్తుతున్నారు; రైతు కష్టంతో ఫలించిన అరటిపండ్లు, కూరగాయలతో కమీషన్ వ్యాపారంచేసి, సంపన్నులౌతున్నారు; రైతు స్వేదంతో ఎదిగిన చెరకును చక్కెరగామార్చి, ఫ్యాక్టరీల యజమానులు కుబేరులౌతున్నారు; పన్నులతో ప్రభుత్వాలు ఖజానాలు నింపుకొంటున్నాయి.

కానీ రైతుమాత్రం? రోజురోజుకి అణగారిపోతున్నాడు; దివాలా తీస్తున్నాడు. రెక్కలకష్టంచేస్తే, చివరికి మిగులుతున్నది అప్పులు, నిరాశ, దుఃఖం మాత్రమే. ఏమిటీ దురవస్థ? ఎవరిదీ ప్రారబ్ధం? ఎంతకాలం ఈచిత్రహింస, మనోవేదన? పాలించే పాలకులకు రైతులంటే శ్రద్ధలేదు; వారిసమస్యలపై మనసుపెట్టను తీరికలేదు; అదే వ్యాపారులైతే, పారిశ్రామికవేత్తలైతే వారికి కోట్లకొలది ఎన్నికలనిధులు సమర్పిస్తారు. తమ లాభాలు పెంచుకోవడానికి ప్రభుత్వాల మెడలు వంచుతారు; చట్టాలే మార్చుకుంటారు; చిన్నకష్టంకల్గినా గొంతెత్తి అరుస్తారు? రైతు ఎన్నికలనిధి ఇవ్వలేడు; ఎంత వేదనైనా మౌనంగా భరిస్తాడేతప్ప ఎవరికీ చెప్పుకోనూలేడు.

రైతు బ్రతుకు ఎల్లకాలం ఇట్లా అణగారి పోవలసిందేనా? రైతు సమస్యలను పరిష్కరించేనాథుడు, వారిని చైతన్యవంతంచేసి, సంఘటితపరచి, పోరాటానికి సిద్ధంచేయగలిగిన నాయకులులేరా?

రైతులేనిదే రాజ్యంలేదు; రైతును ప్రభుత్వాలు ఇట్లనే అనాథలనుచేసి,

### జనవాణి

విస్మరిస్తే భవిష్యత్తులో మిగిలేది అరాజకమే, జాగ్రత్త.

చెర్లోపాలెం — నిరంజన్ ఎం. ఎ.

### తిక్కనపార్కు పేర లక్షలు బూడిద

రంగనాయకులపేటలోని తిక్కన పార్కును అభివృద్ధిచేయడానికి మునిసిపాలిటీ మళ్ళీ వేలాదిరూపాయలు ఖర్చు

— మిగతా 7 పేజీలో

## మేము-మీరు

### రాజకీయాలనుంచి మతాన్ని నిషేధించండి!

ముస్లిం బిల్లుకు సంబంధించి నిర్భీతితో, అత్యంత స్పష్టంగా సంపాదకీయం వ్రాశారు (మే 9 తేది). అయితే ఈ వ్యాఖ్యలు ఎప్పుడో చేసివుండవలసినవి.

స్వాతంత్ర్యంవచ్చి ఎన్నోయేళ్లైన తర్వాతకూడా మనం లౌకికంగా, అభ్యుదయగాములుగా, సమైక్యవాదులుగా ఆలోచించలేక పోతున్నాం. దేశంలో మెజారిటీలోవున్న హిందువులు మాత్రం జాతీయ దృక్పథంతో వ్యవహరిస్తున్నారు; దేశసంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రవర్తిస్తున్నారు. కాని, మైనారిటీల ఆలోచనాధోరణి ఇందుకు భిన్నంగా వుంది. గతించిన కాలంలో హిందువులపై తమ మతం పాలకులుచేసిన పెత్తనాలనే వీరు ప్రస్తావిస్తున్నారు.

ముస్లిం మతావేశపరులకు ఇప్పుడు ప్రత్యేకదృక్పథం ఏర్పడింది. భవిష్యత్తులో వీరు ప్రత్యేకదేశం కావాలని అడిగినా ఆశ్చర్యంలేదు ఇటీవల ఎన్నికలలో

— మిగతా 7 పేజీలో

# ఉత్తమ పంచాయితీ కావాలంటే పన్నులు దండితే చాలా?

84-85 సంవత్సరానికి జిల్లాలో ఉత్తమ పంచాయితీగా వెంకటాచలానికి చెందిన కసుమూర్తిపాడు ఎన్నికైంది. 500 రూపాయల బహుమతి అందుకున్నది. సర్పంచ్ శ్రీ బి. వి. రమణారెడ్డి సమర్థకత, గ్రామసేవకు ఇది ఒక నిదర్శనం.

సమితి స్థాయిలో ఉత్తమ పంచాయితీలుగా మనుబోలు (వెంకటాచలం) పల్లెపాడు (ఇందుకూరుపేట) పూడూరు (పొదలకూరు) అనుమసముద్రంపేట (ఆత్మకూరు) చిరదవోలు (రాపూరు) పిల్లేరు (గూడూరు) మర్లగుంట (వెంకటగిరి) నాయుడుపేట (నాయుడుపేట) తడ (సూళ్ళూరుపేట) ఇనమడుగు (కోవూరు) సర్వాయపాళెం (కావలి) కలిగిరి (వింజమూరు) రేబాల (బుచ్చిరెడ్డిపాళెం). వీటన్నింటికీ రు 200 ల బహుమతి లభిస్తుంది!

పన్నులు దండితేనే ఉత్తమ గ్రామ పంచాయితీలుగా గుర్తించడ ఏమిసామ్రాజ్యమండీ? గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలు పరిగణనకు తీసుకుంటేనే, ఈ బహుమతులకు విలువ, సార్థకత వస్తాయి!

## జిల్లా రైస్ మిల్లర్స్

నెల్లూరుజిల్లా రైస్ మిల్లర్స్ అండ్ డీలర్స్ అసోసియేషన్ కు నూతన కార్యవర్గం ఎంపికైంది. గౌరవాధ్యక్షుడుగా శ్రీ జక్కా కోదండరామిరెడ్డి అధ్యక్షుడుగా శ్రీ డి. రఘునాథరెడ్డి ఉపాధ్యక్షుడుగా శ్రీ కందర్ప సుబ్రహ్మణ్యగుప్త, కార్యదర్శిగా శ్రీ పి. రవీంద్రరెడ్డి,

## నెల్లూరు సంగతులు

సహాయ కార్యదర్శిగా శ్రీ కంకణాల బలరామయ్య, కోశాధికారిగా శ్రీ పిడూరు వెంకటసుబ్బారెడ్డి కార్యవర్గ సభ్యులుగా పేరంశెట్టి జయరామయ్య, మాల్యాద్రి రవిసుందర్, చీదెళ్ళ వెంకటేశ్వర్లు అమరశెట్టి, నరేంద్ర, చెన్నూరు వెంకటేశ్వరరెడ్డి, దేవకి వెంకటరామారావు, సుంకు రామమోహనరావు ఎన్నికైనారు.

### చెస్ పోటీలు

సింహపురి చెస్ అసోసియేషన్ జూన్ 6, 7, 8 తేదులలో ఏ. సి సుబ్బారెడ్డి స్టేడియంలో రాష్ట్రస్థాయిచెస్‌పోటీలు నిర్వహిస్తుంది. బహుమతులు నగదురూపంలో వుంటాయి. వివరాలకు శ్రీ జి. ప్రభాకరరావు అధ్యక్షుడు, 4/28 పోస్టల్ కాలనీ నెల్లూరు 4 చిరునామాకు వ్రాయండి.

### అయ్యప్ప దేవాలయం ప్రతిష్ఠ జనవరిలో

బుజబుజనెల్లూరు దగ్గర, గ్రాండ్ ట్రంక్ రోడ్డునానుకొని బ్రహ్మాండంగా నిర్మిస్తున్న స్వామి అయ్యప్ప దేవాలయం విగ్రహ ప్రతిష్ఠాపన వచ్చే జనవరిలో జరుగుతుందట. దేవాలయనిర్మాణ బాధ్యతను జీవిత పరమావధిగాభావించి పనిచేస్తున్న అంబుజా మోటారువర్క్స్ యజమాని శ్రీ నాయర్ చెప్పారు.

తొలుత ఈ దేవాలయాన్ని ఏప్రెల్ 12 తేది ప్రారంభించాలనుకున్నారు. అయితే రాళ్ళుచెక్కేపనిని శిల్పులు సకాలంలో పూర్తిచేయలేకపోయారట. విగ్రహ ప్రతిష్ఠాపన ఉత్తరాయణకాలంలోచేయాలి కాబట్టి, జనవరికి వాయిదా వేసుకున్నారట. అప్పటికి వినాయకుడు, రాజేశ్వరి, సుబ్రహ్మణ్యస్వామి, నాగదేవత తదితర ఉపదేవతల దేవాలయ నిర్మాణంకూడా పూర్తవుతుందట. అన్నింటి ప్రారంభోత్సవమూ ఒకరోజే!

ఈ దేవాలయ సముదాయంలో ప్రధాన గుడి కట్టడం ఖర్చంతా మాగుంట సోదరులదట; జి. వి. బీడీల సంస్థ యజమానులు. మరికొందరు దాతలు ఉపదేవతల ఖర్చుకు సిద్ధపడ్డారట. ప్రతిష్ఠాపనకే దాదాపు రెండు లక్షలౌతుందని లెక్క కడుతున్నారు నిర్వాహకులు. ఇంక మొత్తం కట్టడానికి ఎన్ని లకారాలో మీరే ఊహించండి.

### మనువంశీయుల సన్మాన పరంపర

మనువంశీయులని ముద్దుగా పిలవబడే గాండ్ల సంఘీయులు ఇటీవల నెల్లూరులో తమ కులభూషణులందరినీ ఒక వేదికపై సన్మానించారు: వార్త పాతదే అయినా వివరాలు సంక్షిప్తంగా ఇస్తున్నాము.

అఖిలభారత విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ల సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికైన అన్నామలై యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ ప్రొఫెసర్ ఎస్. వి. చిట్టిబాబు, మద్రాసు స్ట్రక్చరల్ ఇంజనీరింగ్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ డాక్టర్ ఎం. రామయ్య, కాంగ్రెస్ నె. జి. బి సి విభాగం కన్వీనర్ శ్రీ డి. వరదయ్య, మద్రాసు ఎస్ వి ఇ టి కాలేజి కరస్పాండెంట్ శ్రీ పి. ఎం. నామదేవ్, సినీ నటుడు ఎం. బాలాజి, నాటి రోజుల్లో సుప్రసిద్ధుడైన మాజీ ఎమ్మెల్యే శ్రీ బగ్గిడి గోపాల్. మురళీకృష్ణ గోపాలయ్య సన్మానాలందుకున్నారు.

శ్రీ ఎం. భుజంగభూషణం స్వాగతం చెప్పారు; చివర్న కుమారి హేమమాలిని నృత్య ప్రదర్శన చేసింది. చిట్టిబాబుకు, బగ్గిడి గోపాల్‌కు ఒకేవేదికమీద సన్మానం ఏమిటండీ?

### ప్రకృతి ప్రియులారా, మధువనలై పోదాంరండి..

....అని పిలుస్తున్నారు, స్కాన్ నెల్లూరు నిర్వాహకుడు డాక్టర్ కె. ఆర్. రెడ్డి: నెల్లూరులో ప్రకృతి ఆరాధన పెంపొందింపచేయడం కోసం ఏర్పడిన సంస్థ ఇది.

ప్రపంచ వన్యమృగసంస్థ ప్రకృతి

—కొరవ 11 పేజీలో





## తెలుగుగంగ కాల్వకాదు టౌనులోరోడ్డు!



పైఫోటోలో కన్పించేది తెలుగుగంగ కోసంత్రవ్వి వదిలిపెసిన కాలువ కాదు; వరదకు గండిపడిన చెరువుకట్ట అనలేకాదు. మహాఘనతవహించిన నెల్లూరు మునిసిపాలిటీలో ఇదొకరోడ్డు.

పొదలకూరురోడ్డుకు నాలుగవ అడ్డరోడ్డు ఇది. రెండుప్రక్కల పెద్దపెద్ద బిల్డింగులే లేవాయి. ఐదేళ్ళనుంచి వీరు మునిసిపాలిటీచుట్టూ కాళ్ళరిగేలా ప్రదక్షిణలూ చేస్తున్నారు-తమకీ గుంటబ్రతుకునుంచి విముక్తి కల్గించమని! మెయిన్ రోడ్డునుంచిచూస్తే దాదాపు 15 అడుగులగుంట ఇది. వానపడితేచాలు, కాలువై పారుతుంది. ఇక అక్కడ కాపురాలు చేసేదెట్లా? వీరు బెటర్‌మెంట్‌టాక్స్ కట్టారట: అప్పటి ఛేర్మెన్‌కు, ఇప్పటి స్పెషలాఫీసర్‌కు ఎన్నిసార్లో మొరపెట్టుకున్నారట. కానీ పట్టించుకున్నవాడులేడు. గుంట గుంటగానేవుంది- సంవత్సరాలుమాత్రం గడిచిపోతున్నాయి. వారిగోడు చెప్పనలవికాదు; కమీషనర్‌గారూ, మీరు తలచుకుంటే ఎంతపని ఇది?

# ★ ★ నా మాట ★ ★

## ★ బాడుగిళ్ల బాధలు
## ★ పోలీసుకు 'మర్యాద' అనేదేమంటారా?

తిరిరి జనుమున శైలమైనా సృష్టించవచ్చునేమోకాని, నెల్లూరులో బాడుగిల్లు సంపాదించటంమాత్రం బ్రహ్మతరం కూడా కాదేమోననిపిస్తోంది. ఎవ్వరు చూసినా టౌనులోని ప్రతివీధిలో ఏదో ఒక కట్టడం లేస్తూనేవుంటుంది; కానీ కాపురముండడానికి జానెడుగది కావాలంటే వెతకలేక ప్రాణానికొస్తోంది.

పొగతోట గాంధీనగర్ వంటి 'పోష్' ప్రాంతాలేకాదు - బాలాజీనగర్‌కు వెళ్లినా, ఊరు శివార్లలోని హౌసింగుబోర్డు కాలనీలోచూసినా ఇదేపరిస్థితి. 'నో వేకన్సీ' అని బోర్డులేని ఆఫీసైనా వుంటుందేమో కాని, 'హౌస్ వేకెంట్'అన్న అట్టముక్క కాగడాపెట్టి గాలించినా దొరకడంలేదు.

ధరలుమాత్రం? బియ్యం బంగారం వెలలుకూడా తారామండలంలో అంత దూరంప్రయాణం చేయలేదు. త్రాగడానికి నీళ్ళుపుంతవు - హరనాథపురంలో రెండంకణాల రేకుల ఇంటికి నాలుగు

## డోలేంద్ర

వందలు రెంట్, రామమూర్తినగర్ ఒక మోస్తరు సంపన్నులకుకూడా గగనకుసుమమే! కాళ్ళువారదాపుకోలేని ఇరుకుగదులు కట్టి, ఏడెనిమిదివందలు ఇస్తావా, చస్తావా అంటున్నారు.

బాలాజీనగర్‌కుఏసౌకర్యమూలేనిరాజీద్ నగరని పేరు; కానీ బాడుగలుమాత్రం

—కొరవ 8వ పేజీలో

## చంద్రబాబు

(మొదటి పేజీ తరువాత)

లకే పట్టుగా వున్నారట. చివరి నిము షంలో అకారణం ఎదురయ్యేసరికి తట్టుకోలేక పోయారట.

కోటశ్రీక్కిన రాములాగా బుసగొట్టు న్నారు, ఇప్పుడు డాక్టర్ వెంకటేశ్వర రావు మామగారి మాటలు ఎల్లకాలం నమ్ముతూపోతే. చివరకు చంద్రబాబు నాయుడు తనను పార్టీలో వెల్తి కాముగా మారుస్తారని వెంకటేశ్వరరావు భయం. అసమను, పార్టీలో పదవులు అనిండే వారు, మంత్రిపదవులు ఊడుతాయనే భయం కలిగినవారు. చంద్రబాబు పట్ల కినుక కలిగినవారు, ఇప్పుడు వెంకటేశ్వర రావు చుట్టూ చేరుతున్నారు; ఆయనను రెచ్చగొడుతున్నారు.

కలావెంకట్రావు అయితే, బహిరంగం గానే ఆయన ఇంటిలో మకాంపెడుతు న్నారు, అయితే వెంకటేశ్వరరావు ఇప్పటికిప్పుడే మామగారిపైన తిరుగు బాటు ప్రకటిస్తారని ఎవరూ ఊహించడం లేదు. పార్టీలో వుండే, చంద్రబాబు అటలు కట్టించడానికి ఎమ్మెల్యేలలో బల మైన వర్గాన్ని సమీకరించుకోవాలనేది వారి పథకమట. కేవలం ఎమ్మెల్యేలనే కాక. జిల్లాలలోని పార్టీ అసమ్మతి వాదు లను కూడా చేరదీయడానికి వీరు యత్నిస్తున్నారట.

మామగారి మాటలనమ్మి ఇంతకాలం వేచివుండడమె మూర్ఖత్వమైందని ఇంకా జాగుచేస్తే నష్టంతప్ప లాభంలేదని, తాడో పేడో తేల్చుకోవడానికి ఇదే మంచి తరుణమని వెంకటేశ్వరరావు భావిస్తు న్నారు.

మండలాలు, మునిసిపాలిటీలకు ఎన్నికలు జరపవలసిన సమయంలో ఈ 'గృహఛిద్రం' ఎన్ టి ఆర్ ఎట్లా పరిష్క రించుకుంటారో ఆయనకే తెలియాలి. అయితే వెంకటేశ్వరరావుకు అటు పార్టీలో ఇటు ప్రజలలో కూడా పలుకుబడి పెరిగి పోతుంది.

### జనవాణి

(3 వ పేజీ తరువాత)

పెట్టలేకుండని తెలుస్తూంది.

ఈ పార్కుపై ఇప్పటికి 10 లక్షలకు పైగా ఖర్చుచేశారు. కాంట్రాక్టర్లు, అప్పటి మునిసిపల్ కమీషనర్లు బాగు పడ్డదంతప్ప. పార్కులో కల్పించిన మెరు గేమీలేదు. విద్యుగాళ్ళకు కేంద్రంగా వుంది ఇది. సంసారపక్షం మనిషెవరూ లోపలకు పోలేరు; పేదతీరలేరు ఇటు వంటి పనికిమాలిన పనులకు లక్షలు ఖర్చుపెట్టి. బూడిదపాలు చేయడం దేనికి?

నెల్లూరు -ఎన్. వెంకటరమణయ్య
అడ్వొకేట్

### మేము-మీరు

(3వ పేజీ తరువాత)

రాజకీయాలను మతం ఎట్లా ఆదేశిస్తున్నదో మనం చూస్తూనేవున్నాం.

కాంగ్రెసుపార్టీ సార్వభౌమైనంతక్వరలో రాజకీయాలనుంచి మతాన్ని నిషేధిం చడం అవసరం. తాత్కాలిక ప్రయోజ నాలకోసం కాకుండా, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని వ్యవహరించడం పాల కుల ధర్మం.

ఐదేసంచికలోని ఆత్మకూరు బస్టాండు అండర్‌బ్రిడ్జి వార్తకూడా అన క్తిదాయ కంగా వుంది. మీరు ఇందులో వాడిన భాష పరుషమైనదే; కానీ. సంబంధిత అధికారులకు ఆత్మాభిమానం అనేది వుంటే, దాన్ని తట్టిలేపి, వారిచేత పని చేయించడానికి మరింత కఠోర పదజాలం అవసరమౌతుందేమో!

నెల్లూరు -డి. వి. రమణయ్య
చార్టెడ్ అకౌంటెంట్

కదిరి ప్రి. డి. ము. కోర్టులో

E. P. No. 17 of 85

O. S. No. 34 of 79

యస్. అక్బర్ వలిసాహెబ్ -D.H.R.

చేతరాజు నరసింహులు -J.D.R.

పై దావాలోని ప్రతివాది తాలూకు క్రింద షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పై కోర్టువారివలన 2-6-86 తేదిన పై కోర్టువద్ద ఉ. 10-30 గంటల నుండి సా. 5-30 గం.లోపల బహిరంగముగా వేలము వేయబడును. పాటదార్లు హాజరై పాట పాడుకొనవచ్చును.

- షెడ్యూలు -

అనంతపురం ఆర్. డి. లో చేరిన కదిరి యస్. ఆర్. డి. లో గల వేపరాల గ్రామ పొలంలో- (1) గవర్నమెంటు మెట్ట సర్వేనెం. 310-3 య.2-50ట్లు తరం రు. 1-21 పై, పూర్తి.

డి.హెచ్ ఆర్. మతింపు రు. 1500/- పై ఆస్తి విలువ, కదిరి స్టేట్ బ్యాంక్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంటు బ్యాంక్‌లో గల ఆయకమునకు లోబడి ఇవ్వబడినది

-యస్. సత్యనారాయణగుప్త,
డి. హెచ్, ఆర్. అడ్వకేటు.

ఒంగోలు ప్రి॥ డి॥ ము॥ కోర్టులో

O P No. 7/86

1 చేబ్రోలు అమ్మణ్ణి W/o. రామకృష్ణయ్య వగైరా -పిటిషనర్లు ఉప్పుగుండూరు

చేబ్రోలు రామమోహనరావు S/o. రామకృష్ణయ్య నం 258 సత్రంత కాశేశ్వరరావు మార్కెట్టు దగర విజయవాడ రెస్పాండెంటు

లేటు చేబ్రోలు రామకృష్ణయ్య చనిపోయినందున ఆయనకు రావలసిన ఒంగోలు సబ్ కోర్టు ఐ పి. 15/70లో రు 35-6-07 చీరాల డి॥ ము॥ కోర్టులో ఓ.ఎస్ 333/81 దావా బాకీ రు. 1360/- రాబట్టుకొనుటకు వారసులైన పిటిషనర్లు సక్సెషన్ సర్టిఫికేటు ఇప్పించవలెనని పిటిషను పెట్టుకొనిరి ఎవ్వరికైనా అభ్యంతరములున్నచో తెలుపుకొనుటకు 3-6-86 తేది వాయిదా గాన ఆరోజు ఉదయం 10-30 గంటలకు పై కోర్టువారి ఎదుట ఆక్షేపణలు తెలుపుకొనవలెను లేనిచో మీ పరోక్షమందు తీర్మానించబడునని ఇందు మూలముగా తెలియపరచడమైనది.

-యార్లగడ్డ వెంకటశేష సుబ్బారావు పిటిషనరు తరుపు అడ్వకేటు

## నామాట

(1 వ పేజి తరువాయి)

ఒదేసివదరలకు పైమాటే. ఊపిరిపీల్చుకోవాలంటే వసిరేసినట్టుంది దర్గామిట్ట కాలనీలో కాలుపెడితే, కలిపోతున్నాయి ఒద్దెం వెలం యుద్ధంలో పలావీతులైన మహా-వీరులు ఖాళీచేసిన కోటవలె, దిలోసిమంటుంటూంది-మూలపేట; కానీ తప్పిపెట్టిందు కప్పంకట్టినట్లు ఒద్దెలు కట్టవలసివస్తోంది.

ఉద్యోగరీత్యా పొరుగూళ్ళ నుంచి వచ్చే నన్ను తీతగాళ్ళ పరిస్థితి చూస్తుంటే అయ్యో అనిపిస్తున్నది! ముప్పయిరోజుల కష్టంలో మూడోవంతు తలదాచుకోవడానికే సరిపోతే ఇక తినేదేంటి? బ్రతికేదేంటి? ఐదారేళ్ళ క్రితం ఇళ్ళు కింత కటకటలేదు టౌన్‌లో. ఇటీవలే వచ్చిపడ్డాయి కష్టాలన్నీ!

పల్లెలనుంచి పెద్ద ఎత్తున రైతులు టౌనుకు వలసరావడమే ఇందుకు కారణమా? పల్లెటూళ్ళు పాడుబడి, పట్టణాలు కిక్కిరిసి పోవడం మనలో ఎవరికి మేలు!

• • •

అమర్యాద, అహంకారం పోలీసులకు వృత్తిశిక్షణతోపాటు ఉగ్గుపెట్టి పోస్తారా అనిపిస్తుంది. సమాజానికి కొరకరాని కొయ్యలుగా తయారైనవారితో నిత్యం మసలాలి కాబట్టి, వీరిలో కొంత మొరటుతనం కన్పించడం సహజమే; కాని యుక్తాయుక్త విచక్షణకూడా కోల్పోవడం విచారకరం.

వి. ఐ. పి. ల సమక్షంలో వీరి ప్రవర్తన మరీ దుస్సహంగా వుంటుంది. దూదిరమ్మంటే కాల్చుకుని వచ్చేరకన్న సామెతను స్మరణకుతెస్తుంటారు. మొన్న 12 తేది ఉదయం ముఖ్యమంత్రి వచ్చినప్పుడు పోలీసు పెరేడ్ గ్రౌండ్స్‌లో పోలీసులు మరీ అతిగా ప్రవర్తించారు. వచ్చినవారందరినీ గేటుదగ్గరే ఆపేశారు; పత్రికలవారినికూడా అడ్డగించారు. సమాచారశాఖ పున్న తాధికారి ఒకరు అక్కడున్న సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌కు నచ్చచెప్పబోతే, ఆయనపైనే విరుచుకపడ్డారు పోలీసులు. అమిత అమర్యాదకరంగా మాట్లాడారు. ఈలోగా ఎస్. పి. శ్రీ ఆర్. ఆర్ గిరీశకుమార్ వచ్చి, వారికి ఆదేశాలిచ్చినంతవరకు పత్రికలవారికి ప్రవేశం దొరకలేదు. ఎస్. పి. స్వయంగా వ్రాసి ఇచ్చిన ప్రవేశపత్రాలుకూడా వారికి చెల్లనికానులుగా కన్పించాయి.

వి. ఐ. పి. లకు భద్రతాఏర్పాట్లు పటిష్టంగా చేయవలసిందే; అందుకు పోలీసులను తప్పుపట్టలేము. కాని ఆ పనిలో కూడా విచక్షణ అవసరంలేదా? ఖాకీ దుస్తులు వేసుకోగానే, తక్కినవారినందరినీ అల్పమానవులుగా చూడడం ఏమి మర్యాద? ★

## కావలి కబుర్లు

(5 వ పేజి తరువాయి)

వచ్చినప్పుడు, పత్రికలవారు పదేపదే అడిగినందువల్లకాబోలు, పార్టీ అధిష్టానవర్గం ఇన్నిరోజులతర్వాత ఆయనచేత రాజీనామాచేయించింది.

అధికారపార్టీ అండవుంటే, ఎంత అన్యాయపు పనైనా, ఎంత దర్జాగా జరిగించుకోవచ్చో తెలుసుకోవడానికి ఇది నిదర్శనం కాదంటారా? ఇదేపని, మరొక ప్రభుత్వోద్యోగి చేసివుంటే సహించేవారా? ప్రభాకరనాయుడు కాంగ్రెసీయుడై వుండినా ఈ పాటికి ఎంతరచ్చ జరిగివుండేది? అందుకే అన్నారు, గురుగింజకు తన క్రిందవుండే నలుపు తెలియదని!

### జవహర్ భారతి వార్షికోత్సవం

జవహర్‌భారతి కాలేజి ప్రారంభించి ముప్పయ్ ఐదేళ్లయిందట; ఇటీవల వార్షికోత్సవసభ జరిపారు. రెక్టార్ శ్రీ జి. రామచంద్రారెడ్డి అధ్యక్షించారు. జాయింట్ కలెక్టర్ శ్రీ దయాచారి ముఖ్య అతిథి; విద్యాలయాలన్నీ సంక్షోభమై, అల్లకల్లోలంగావున్న ఈరోజుల్లో జవహర్‌భారతి కాలేజి సముద్రంమధ్య ద్వీపంలాగా వుందన్నారాయన. ప్రిన్సిపల్ శ్రీ రాధాకృష్ణ నివేదిక చదివారు. ఈ ఏడాది 150 మంది విద్యార్థినీ విద్యార్థులకుడిగ్రీలు, పట్టాభిషేకంచేశారు.

### కలిగిరి మండలం రెవిన్యూ అధికార్ల దగా

పూర్వపుఆత్మకూరు తాలూకా ప్రస్తుతం కలిగిరి మండలానికిచెందిన కావలిముస్తాపురంలో, 80 మంది హరిజన గిరిజనులను దగాచేసి, వారి నోట్లో మట్టికొట్టారట రెవిన్యూ అధికార్లు.

ఈ గ్రామంలో 1978 లో 300 ఎకరాల భూమిని సమష్టి వ్యవసాయ క్షేత్రంగాచేసి 80 మంది పేదలకు లీజు పట్టాలిచ్చారట. ఇందులో 100 ఎకరాలు మాత్రం రైతులు హైకోర్టుకెళ్ళి తెచ్చుకోవడంతో అప్పుడే విడిపోయాయి. మిగిలిన 200 ఎకరాలకు 84 లో లీజు గడువు ముగిసిపోయిందట. అందువల్ల, తమకు వ్యక్తిగత పట్టాలివ్వమని 1983 నుంచే ఈపేదలు అధికార్లచుట్టూ తిరుగుతున్నారట.

వీరిట్లా తిరుగుతూనేవున్నారు ఇంకొకప్రక్క రెవిన్యూ అధికార్లు 1982 లో ఈ 200 ఎకరాలకు గ్రామంలోని కొందరు ధనికులకు పట్టాలిచ్చేశారట. పుస్తకాలలోకూడా వారిపై సాగురాశారట. అప్పుడు జరిగితే, ఇప్పుడు తెలుసుకున్నారు హరిజనులు ఈ కుంభకోణం గురించి.

ఈ పేదలు దిక్కుతోచనిస్థితిలో కలెక్టరుకు, ఆర్. డి. ఓ. కు మొరపెట్టుకుంటున్నా . చాలా అన్యాయం, మోసం ఇది. కలెక్టరుగారూ, మీరు స్వయంగా విచారించి, వారికి న్యాయంచేయండి. ★

## పంచాంగం

### నృసింహజయంతి

22.5.1986 వ తేది గురువారం నృసింహ జయంతి

### కృత్తికకార్తె

25 5 1986 వ తేద ఆదివారం ఉదయం 9-13 గంటల వరకు కృత్తికకార్తె వుంటును.

### మే తిథులు

17 శని అష్టమి వ. 1-09 గం. వ.
18 ఆది నవమి వ. 12-45 గం. వ.
19 సోమ దశమి వ. 11 50 గం. వ.
20 మంగళ ఏకాదశి వ. 10-36 గం.
21 బుధ ద్వాదశి ఉ. 8 52 గం. వ.
22 గురు త్రయోదశి ఉ. 6 56 గంవ
చతుర్దశి తె. 4 38 గం వ
23 శుక్ర పూర్ణిమ రా. 2 24 గం. వ

—నిమ్మగడ్డ వెంకటేశ్వర్లు

## బకింగ్‌హాం

(6 వ పేజి తరువాయి)

సులభతరమూ, చౌక అవుతుంది. ఇప్పుడు విజయవాడ, మద్రాసులమధ్య అధమపక్షం రోజుకు 4 వేల లారీలలో 4 లక్షల టన్నుల సరకు రవాణా వుతుందని అంచనా. ఒకటన్ను రవాణాకు రోడ్డుపైన కిలోమీటరుకు 40 పైసలు ఖర్చయితే, కాలువలో 20 పైసలు సరిపోతుందట. దాన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు, ఈ కాలువకు ఎంత ప్రాధాన్యత వుందో; ఎన్నికోట్ల రూపాయలు ఆదా చేయగలదో!

కృష్ణాపట్నం రేవు అభివృద్ధి దృష్ట్యా కూడా బకింగ్‌హాం కాలువను వెంటనే చేపట్టడం అవసరం. జలమార్గమేర్పడితే, మద్రాసు హార్బర్‌లో రోజుల తరబడి నిరీక్షిస్తూ, కోట్ల రూపాయలు డెమరేజ్ కట్టే స్టీమర్లన్నీ కృష్ణాపట్నాన్ని ఆశ్రయిస్తాయి.

ఒక్క పెంచలయ్యేకాదు, జిల్లాలోని ఎమ్మెల్యేలు, ఇతర నాయకులుకూడా ఈ బాధ్యతను స్వీకరించి, కేంద్రంపై వత్తిడితేవడం ప్రయోజకరం. ★



## ● నిర్యాణము ●

జనాబ్ షేక్ మస్తాన్ సాహెబ్ గారు

(Land Lord)

కొత్తపాలెం, కోట మండలం

14-4-86 తేది మమ్ములను దుఃఖసాగరంలో ముంచి ఆకస్మికముగా స్వర్గస్థులైరి.

40 రోజుల కర్మ (చెహిలం) తేది 22-5-86 గురువారం కొత్తపాలెంలో మా స్వగృహమందు జరుగును.

-కుటుంబ సభ్యులు

# సెన్సార్ ఆలస్యం నిర్మాతలను అగచాట్లపాలు జేస్తూంది!

**మా మద్రాసు సినీప్రతినిధి**

అవినీతి పాల్పడ్డారనే అభియోగం మీద సస్పెండ్ చేయబడ్డ సెన్సార్ ఆఫీసర్ స్థానే మరొకరు ఇంతవరకు నియమింపబడలేదు. అందుచేత, షెడ్యూలంతా పూర్తయినా సెన్సార్ సర్టిఫికేట్ లభించనందున కొన్ని చిత్రాల విడుదలలు వాయిదావేయబడ్డాయి. పాపం, చాలా మంది నిర్మాతలకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడిపోయింది. తమ చిత్రాలకు మోక్షమెప్పుడో తెలియకుండావుంది. త్వరలోనే కొత్త ఆఫీసర్ రావొచ్చు. ఆయన సర్టిఫికేట్లు ఇవ్వగానే ఒకే నెలలో ఎన్నో చిత్రాలు విడుదలచేసుకోవలసివస్తుంది; అనివార్యంగా ఒకదానికొకటి పోటీగా తయారౌతాయి. ఇదినిర్మాతలకు ఎంత నష్టమో చెప్పలేము.

## ఆర్. డి. బర్మన్ సంగీతం

వంగమూరి బాలకృష్ణ మిమిక్రీ ఆర్టిస్టుగా అమెరికాలో తయారయ్యే "నటరత్న" చిత్రానికి ఆర్. డి. బర్మన్ సంగీతమిస్తున్నారు. ఇది కొందరు సంగీత దర్శకులకు బాధకలిగించింది. మేమింత మందిమి వుండగా బొంబాయికెళ్ళి అత్యధిక వ్యయంతో ఆర్. డి. బర్మన్ చేత సంగీతమిప్పించాల్సినంత అవసరం ఏమి ఏర్పడిందని ఒకరిద్దరు పాత్రికేయుల ఎదుట వాపోయారుకూడా. కాని ఆర్.డి. బర్మన్ ఈ అవకాశాన్ని ఒకసవాల్‌గా తీసుకుని, తన అనుభవాన్నంతా రంగరించిపోసి మహాద్భుతమైన మ్యూజిక్ ఇస్తానని మాట ఇచ్చాడట.

## మల్లెమాలచిత్రంలో అక్కినేని

మల్లెమాల సుందరరామిరెడ్డి నిర్మించే కౌముదీ పిక్చర్స్‌వారి చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు హీరో. ఇదికాక మరో చిత్రనిర్మాణానికికూడా ఎం. ఎస్. రెడ్డి సన్నాహాలు చేస్తున్నారు. సంగీత సాహిత్యాలు ఉన్నతస్థాయిలోవుంటూ సకుటుంబంగా చూసేచిత్రాలు నిర్మించాలన్న ధ్యేయంగలవారిలో రెడ్డిగారొకరు.

## అంజయ్య కుమారుని చిత్రం

మాజీ కేంద్ర కార్మికశాఖామాత్యులు శ్రీ టి అంజయ్య పుత్రుడు టి. శ్రీనివాస రెడ్డి గతంలో "ముఖ్యమంత్రి" చిత్రాన్ని నిర్మించాడు. ఇప్పుడు కృష్ణ, శ్రీదేవి జంటతో మిద్దె రామారావు సారథ్యంలో ఒకచిత్రాన్ని నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు. హీరో కృష్ణ పుట్టినరోజు మే 31 న ఈచిత్రం షూటింగ్ ప్రారంభమవుతుంది. కె. బాపయ్య దర్శకులు

## చక్రవర్తి రికార్డింగ్

చాలాకాలంగా సంగీత దర్శకుడు చక్రవర్తి 'విజయాగార్డెన్స్'లో బి. నాగిరెడ్డి అత్యాధునికంగా నిర్మించిన డీలక్స్ థియేటర్‌లోనే పాటలు రికార్డ్ చేయిస్తుండేవాడు. ప్రతిరోజూ ఒకటోరెండో పాటలు ఆయన సంగీత దర్శకత్వంలో అక్కడే రికార్డవుతుండేవి. ఉన్నట్టుండి ఈమధ్య కారణమేమిటోగాని ఆయన ఎ. వి. ఎం. స్టూడియోలో ఇటీవలే నిర్మించిన రికార్డింగ్ థియేటర్‌కి తనపాటల రికార్డింగ్‌ను మార్చాడు. ఇది చిత్రపరిశ్రమలో చాలా మందికి విస్మయం కలిగించింది. కాని, అందుకు అసలు కారణమేమిటో ఎవరూ ఊహించలేకుండావున్నారు. తెలుగువారి రికార్డింగ్ థియేటర్‌లో తెలుగు పాటలు రికార్డింగ్ కాకపోవడమా అన్న బాధ మాత్రం కొందరిలోవుంది.

ఈ చిత్రపరిశ్రమలో ఇటువంటి హఠాత్పరిణామాలు సహజమే!

## తెలుగువారి సభకు తమిళులే ఎక్కువ!

జాతీయ చలనచిత్ర అవార్డులు పొందిన సుహాసిని, జయకృష్ణ, ఇళయరాజా, రమేష్‌నాయుడు, భారత్‌రాజా మున్నగువారిని అభినందించడానికి ఎం. ఎస్. రెడ్డి ముఖ్య అతిథిగా డైరెక్టర్ కె. విశ్వనాథ్, ఏడిద నాగేశ్వరరావు, ఎన్. భాస్కరరెడ్డి కలిసి సంయుక్తంగా ఏర్పాటు చేసిన సభకు తమిళులకన్నా తెలుగువారు తక్కువ సంఖ్యలో హాజరవడం కె. విశ్వనాథ్‌కు ఎంతో వేదన కలిగించింది. ఆ విషయాన్నే ఆయన తన ఉపన్యాసంలో వ్యక్తపరచారు

—కొరవ 11 పేజీలో



'కలియుగ కృష్ణుడు'లో రాధ

# ముందు జాగ్రత్తలో తారలు

కొనుగోలుదారులు రావడం తక్కువైంది. అయినా, కాల్‌షీట్లు వృధా కాకూడదు గనుక కొందరు నిర్మాతలు అప్పోసప్పోచేసి, చిత్రాలను పూర్తిచేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆతర్వాత వాళ్ళు తమకు డబ్బు ఇస్తారో లేదో అని బెంగెట్టుకున్న కొందరు తారలు నల్లధనం పూర్తిగా చెల్లిస్తేగాని ఆఖరి షెడ్యూల్‌లో పనిచేయడానికి ఒప్పుకోవడంలేదు. నేడు నిర్మాతలు పడుతున్న పాట్లు అన్నీ ఇన్నీ కావు. ★





'కొంటెకాపురం'లో రమాప్రభ, నూతనప్రసాద్, వై. విజయ

## బూతులేనిదే హాస్యం స్రవించదా?

# కొంటెకాపురం

**చిత్రసమీక్ష**

తోబుట్టినవారి కాపురాలలో కలతలు, వెతలుచూసి పెళ్ళిమీదే మనసు విరిగిన సుందరం, రాజీ- విధిలేని పరిస్థితులలో కళ్యాణదంపతులౌతారు. నెలతిరిగేలోగా ఒకర్నొకరు వదిలేయడానికి పన్నాగాలు పన్ని, ఎడబాటు యత్నంలో ఒకరికొకరు దగ్గరై మూరేళ్ళపంటను పండించుకోవడానికి సిద్ధపడుతారు.

వీరిద్దరి పరిచయం, కలయిక, కళ్యాణం, విడిపోవడానికి దారులు వెతకడం.... ఈ విడివిడి పూసలన్నింటినీ సంభాషణలనే దారంతో పేని, 'కొంటెకాపురం' సృష్టించాడు దర్శకుడు- రేలంగి నరసింహారావు.

యువతరం అనాలో, కొత్తతరం అనాలో నాకు తెలియదుకాని, హాస్యం ఒక్కటే సర్వంగాచిత్రాలుతీర్చిదిద్దడంలో స్పెషలైజ్ చేస్తున్న దర్శకులలో రేలంగి నరసింహారావు ఒకడు. హాస్యసంభాషణలు పుష్కలంగాపుట్టించి, కొంటెచేష్టలు నేర్పుగా చిత్రీకరించి, ప్రతిచిత్రంలో ఒక ప్రత్యేకతరహా హాస్య పాత్రను సృష్టించి, ప్రేక్షకులను నవ్వించి,

—కొరవ 11వ పేజీలో

# శివారెడ్డి పద్యాలు

ప్రశ్న: పూరకోనది?

పాతమంత్రి తెందు వర ... కొత్తవారు
ఎవరు గెల్చిరిదు
వారు ... పూరకొన్న పళ్ళ
... కల్పమిది?

ప్రాతలారు తారు పైపైన ... గారు
... ... ...
ఎక్కి రైపైన ... చేసిర
మంత్రి లై ... పదవి మత్తుమందు!

... పోదు ... ... ...
పై ... గుండు ... వారిదు

ఆంధ్రముఖ్యమంత్రి ... అంటిరిగేం
... ఎవరు ప్రతిరె ...
ప్రాంక్ ... పారిబిట్సు!

... పీలపైన ... గూగొమ్ము
... ... ... కొం ... ...
వెళ్ళు ... పద్ము ... మయ్యారైన
ముఖ్య మంత్రి పదవి రెప్ప ... అందు!

### బుర్ర అన్నపూర్ణ

అన్నపూర్ణ వధువు అందాల ...,
మంత్రిగారి ... మల్లెమొగ్గ
బుర్రలో ... ... కల్యాణ
మండపమ్ము స్వర్గ మందిరమ్ము!

... తో ... ... ... ...
... ... ... ... ...
... ... ... ఎదిరింద
... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... ... ...!

### అనుగుంట

అనుగుంట! నీదు ... సంపత్తి
... ... ... ..., చూడ
వార్త పత్రికల్లొ వస్తె, రేపో మాపో
... ... ... ...!







## జిల్లా వార్తలు

(5వ పేజీ తరువాయి)

### వరకవిపూడి

### మార్క్సిస్టుల దౌర్జన్యం

పంచాయతీఎన్నికలురానున్నందువల్ల తమవర్గంవారు చెదరిపోకుండా కాపాడుకోవడానికనుకుంటాము-మార్క్సిస్టుపార్టీ నాయకులు గ్రామాల్లో చిచ్చుపెట్టడం ప్రారంభించారు. రైతులకు కూలీలకే కాదు, కూలీలమధ్యకూడా చిచ్చు పెడుతున్నారు.

6 తేది వరకవిపూడిలో జరిగిన దౌర్జన్యకాండ ఇటువంటిదే! హరిజనవాడలో మెజారిటీ మార్క్సిస్టులదే అయినా, పాతికఇళ్ళలో ప్రత్యర్థులున్నారట. అది కంటకింపుగా తోచిందేమో, 6 తేదిరాత్రి మార్క్సిస్టులకుచెందిన హరిజనులు తోటి హరిజనుల ఇళ్ళపై కత్తులు కటార్లతో దాడిచేసి భీభత్సం సృష్టించారట. దాదాపు 12 మందికి, ఆరుగురు ఆడవారితోసహా మంచిదెబ్బలట. అందులో ముగ్గురికి ప్రాణాపాయంగా వుందట; వారిని వెంటనే మద్రాను జనరల్ ఆస్పత్రికి పంపారు.

పోలీసు దాదాపు 22 మందిపై కేసు నమోదుచేసింది. అందులో 19 మంది 12 తేది కోర్టులో సరెండరైనారు, మేజిస్ట్రేట్ వారినందరినీ రిమాండుకు పంపారు.

రెండుమూడేళ్ళనుంచి వరకవిపూడిలో మార్క్సిస్టులు సాగిస్తున్న దౌర్జన్యకాండకు ఇది పరాకాష్ట, పాత కేసులన్నీ ఇప్పుడు విచారణకు వచ్చాయట. ప్రస్తుతం దెబ్బ తిన్న హరిజనులు వాటిలో సాక్షులట. సాక్ష్యం చెప్పకుండా తమను భయపెట్టడానికే ఈ దురాగతానికి పాల్పడ్డారని వీరి ఆరోపణ,

వరకవిపూడిలో కొందరు రైతులు మార్క్సిస్టులను సైగా చేరదీసి, తమ వ్రేలతో, తమకన్నే పొడుచుకుంటున్నారు. రైతులలో ఐక్యత రానంతకాలం వీరిదే ఇష్టారాజ్యం. తప్పదు,

### మైపాడు ప్రారంభోత్సవం

మైపాడులో కొత్తగా కట్టిన ఎలిమెంటరీ స్కూలు భవనం ప్రారంభోత్సవ 6 తేది జరిగింది. సమితి అధ్యక్షుడు శ్రీ ఆనం భక్తవత్సలరెడ్డి రిబ్బను కత్తిరించారు. అక్కడే సభ, జిల్లా బి జె పి. అధ్యక్షుడు శ్రీ ఇందుపూరు దశరథరామరెడ్డి అధ్యక్షించారు. మాజీ ఎమ్మెల్సీ శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి ముఖ్య అతిథి. శ్రీ ఆనం వివేకానందరెడ్డి ఉపన్యాసకుడు సర్పంచ్ శ్రీ రవ్వూరు రాధాకృష్ణారెడ్డి సభ నిర్వహణతోపాటు, స్వాగత వందనాలు చెప్పారు.

### గూడూరు స్టేడియం

గూడూరుకు త్వరలో ఒక స్టేడియం రానున్నది. చాలాసంవత్సరాల నుంచి గూడూరీయులు కంటున్న కల నిజం కాబోతుంది యువకులకు. గూడూరులో ఏ మంచి కార్యక్రమం చేపట్టినా ముందు నిలిచే ఉత్సాహి శ్రీ వై. గోపాలరెడ్డి ఈ కార్యభారాన్నికూడా తన భుజంపైనే వేసుకున్నారు. ఆయనతోపాటు సబ్ కలెక్టరు శ్రీ బి. వి. రమణ, జి.వ. ఛైర్మన్ శ్రీ యల్లసిరి శ్రీనివాసులురెడ్డి, పి ఆర్., రోటరీ, లైన్స్ క్లబ్బుల అధ్యక్షులు, మునిసిపల్ ఛైర్మన్, కమిషనరు, శ్రీ సి. రామకృష్ణ తదితరులతో ఒక కమిటీకూడా ఏర్పడింది.

ప్రభుత్వాసుపత్రి ప్రక్కగా వున్న 4.85 ఎకరాల మిలిటరీ మైదానంలో స్టేడియం నిర్మాణం తలపెట్టారు. తొలి విరాళంగా శ్రీ అల్లూరు ఆదిశేషారెడ్డి లక్ష రూపాయలు వాగ్దానం చేశారు. గ్రామీణ కాంతి పథకం క్రింద ఒకటిన్నర లక్ష సేకరిస్తారట. స్టేడియంకు ఎ. ఎ. ఆర్. స్టేడియం అనేపేరు పెడతారట.

ఇటీవల నెల్లూరులో 'నెఫ్రా' సన్మానం స్వీకరిస్తున్న జ్యోతిచిత్ర సంపాదకుడు తుర్లపాటి కుటుంబరావు; డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, సుందరరామిరెడ్డి

### వాసిలి ఖండన

ఆత్మకూరు తాలూకా వాసిలి హైస్కూలు టీచరు వెంకటేశ్వర్లు బదిలీపై గతవారం మావార్తను సర్పంచ్‌తోసహా, గ్రామస్తులు చాలామంది ఖండిస్తున్నారు. ఉపాధ్యాయుడు హైస్కూలు అభివృద్ధికి ఎంతో పాటుపడుతున్నాడట. మంచిదే!

### రామనారాయణకు

### దేగపూడి విజ్ఞప్తి

రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఆనం రామనారాయణరెడ్డిని స్వయంగా కలుసుకోవడానికి కుదరలేదట-అందువల్ల మాద్వారా తమ సమస్యలు చెప్పుకుంటామంటున్నారు, దేగపూడి గ్రామస్తులు.

గ్రామ చెరువుకు వున్న రెండు తూములు చెడిపోయి వున్నాయట వాటికి అడ్డగోడలు కట్టి, చెక్కలు బిగించాలట. లేకుంటే చెరువులో నీరు వృధాగాపోయి, 600ఎకరాలలో పైరు దెబ్బతింటుందట; నెల్లూరు, గూడూరు మెయిన్‌రోడ్డు నుంచి గ్రామానికివచ్చే బ్రాంచి రోడ్డును రిపేరు చేయించి, మధ్యలోవున్న కాల్వపై కల్వర్టు కట్టించాలట.

ఇవికాక పానుపుస్తకాలు, కరెంటు బిల్లుల సమస్యలు, విలేజి అసిస్టెంట్ దర్శనభాగ్యం కల్గకపోవడం, పూర్తికాని అంగన్‌వాడి కేంద్రం తదితరాలు చాలానే వున్నాయి. రామనారాయణరెడ్డిగారూ-ఒకసారి ఆగ్రామమెళ్లిరాకూడదా?

### షార్‌లో మే డే

షార్ ఎంప్లాయీస్ ట్రేడ్‌యూనియన్ 1 తేది మేడే ఘనంగా జరిపింది. శ్రీ పి. కోటయ్య, శ్రీ ఎం. సంజీవప్ప ప్రసంగించారు; ఐ. జె. విజయకుమార్ వందనాలు చెప్పారు.

★

## ముఖ్యమంత్రి (2 పేజీ కొ.వ)

దారులన్నీ తివురు పచ్చ రంగు వెల్వెట్ గుడ్డతో అలంకరించారు; రోడ్లు దుమ్ము దులిపి, రంగులు పూశారు; షామియానాలు వేశారు; వాటి క్రింద చెట్లు తెప్పించి అందంగా పేర్చి పెట్టారు; అభివృద్ధి కార్యక్రమాల వివరాలను అచ్చు వేయించారు; అయిదెన్నుల, సైరెంజన్లు సిద్ధం చేశారు; జనరేటర్లు బిగించారు; ఇంకా ఏవేవో చేశారు. వ్యక్తిగత కార్యక్రమాలకు ఇంతింత ఖర్చుపెట్టడానికి ఎవరబ్బ సొత్తని ఎన్. టి. ఆర్. ను అడిగితే....? అయినా పిల్లిమెడలో గంటకట్టేవారెవరు ఉంటి!

ముఖ్యమంత్రి వున్నది మూడు నిముషాలే అయినా, జిల్లా రాజకీయనాయకులు మాత్రం ఆయన ఎదుట తమ ప్రతాపం ప్రదర్శించడానికి పోటాపోటీలు పడ్డారు. తీవు ఎక్కేదగ్గరే పేచీ వచ్చింది. కలెక్టరు ఈ గొడవెందుకున్నారేమో, మంత్రిని తప్ప మరెవ్వరినీ దగ్గరకు రానివ్వలేదు. ఎక్కిన రమేష్‌రెడ్డినికూడా దింపివేశారు. అయితే మండపంనుంచి తిరుగు ప్రయాణంలో మాత్రం రామనారాయణరెడ్డి, రమేష్‌రెడ్డి ఇద్దరూ జీపులో చోటు సంపాదించుకున్నారు.

ముఖ్యమంత్రి మాత్రం ఏ నాయకుడినీ ప్రత్యేకంగా చూడలేదు; పలకరించలేదు. గంగాధరంవంటివారు ముందు ముందు నిలబడినా, అరడజను మంది మంత్రులు ఎదురేగినా చిరునవ్వే పలకరింపు!

తిరుగుపోకలో హెలికాప్టరెక్కేటప్పుడు మాత్రం కలెక్టరును చెల్లపెంపకం ఎట్లా వుందని అడిగారు. ఫస్ట్‌క్లాస్ వుందని చెప్పారు అన్నకేమీలు పేశ. పైగా గృహ నిర్మాణాలు, ప్రగతికథం కార్యక్రమాలలో నెల్లూరు రాష్ట్రంలో ప్రథమంగా రాణిస్తున్నదని చెప్పారు. ముఖ్యమంత్రి శ్రీకృష్ణపరమాత్మునివలె చిద్విలాసంచేసి 'యువకుడివిరరా, పరుగుపందెంలో ముందునిలువు' అని భుజంతట్టారు. శాంతి భద్రతల పరిస్థితి ఎట్లావుందని ఎస్. పి. శ్రీ ఆర్. ఆర్. గిరీష్‌కుమార్‌తో పెదాలు విడివడకుండా, గుసగుసగా అడిగారు.

మార్గమధ్యంలో, సోమశిల ఎస్. ఇ. ఆఫీసు ఎదురుగా, రోడ్డుప్రక్కన తమ బాకీలు చెల్లించండంటూ తెలుగుగంగ కాంట్రాక్టర్లు చేస్తున్న రిలేనిరాహారదీక్షల శిబిరం వుంది. అది ముఖ్యమంత్రి కళ్ళబడకుండా వుండడానికి తుపాకులు, శిరస్త్రాణాలు ధరించిన పోలీసులను నిలబెట్టి దడికట్టించారు. అయితే కాంట్రాక్టర్లు ఎన్. టి. ఆర్. కళ్ళలో పడనేపడ్డారు; పరుగెత్తుకొచ్చి వినతిపత్రమిచ్చారు. ఇక చెప్పాలా, అన్నగారు అరనిముషంలో వారికి అరచేతిలో స్వర్గంచూపి, అక్కడి నుంచి కదిలారు.

తర్వాత పత్రికలవారితో రెండే మాటలు - తెలుగుగంగ కాంట్రాక్టర్లకు బాకీలు చెల్లించడానికి ఏర్పాట్లు చేస్తామన్నారు; మంత్రివర్గవిస్తరణవుంటుంది, సస్పెన్స్ తోవేచిచూడండి అని చెప్పి హెలికాప్టరెక్కి వెళ్ళారు.

ముఖ్యమంత్రికి ముందుగా, పెళ్లికోసం దాదాపు పదిమందికంటే అధికంగా మంత్రులొచ్చారు. హోంమంత్రి శ్రీ వసంత నాగేశ్వరరావు, విద్యామంత్రి శ్రీ ముద్దుకృష్ణమనాయుడు, ఇరిగేషన్ మంత్రి శ్రీ కె.ఇ. కృష్ణమూర్తి, రవాణా మంత్రి శ్రీ జానారెడ్డి, గనులమంత్రి శ్రీ సత్యనారాయణ, వ్యవసాయమంత్రి శ్రీ ఆర్. రాజగోపాలరెడ్డి పరిశ్రమలమంత్రి శ్రీ ఎస్ రామచంద్రారెడ్డి వక్ఫ్ మంత్రి శ్రీ ఫరూఖ్ వీరిలో కొందరు. ఆర్ టి.సి. ఛైర్మన్ శ్రీ ఆరేటి కోటయ్య, ఎన్. టి. ఆర్ పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావు ఇతర ముఖ్య అతిథులలో ముఖ్యులు. ఎమ్మెల్యేలు, అధికార్లు పార్లమెంట్ సభ్యులుకూడా దండిగానే వచ్చారు. ఎవ్వరికీ కార్యక్రమాలులేవు. పెళ్ళి చూడడం, తిరిగిపోవడం. అంతే!

కె. ఇ. కృష్ణమూర్తిగారు మాత్రం తెలుగుగంగ జలాలను తమిళనాడు నీరులకోసం ఎదురుచూడకుండా, తామె చెల్లిస్తామని పత్రికలవారికిచెప్పారు. విద్యామంత్రి శ్రీ ముద్దుకృష్ణమనాయుడు ముఖ్యమంత్రి వుండగా పత్రికలకు తామేమీ చెప్పలేనని రాజభక్తి ప్రదర్శించుకున్నారు. రీజినల్ వర్క్‌షాప్‌ను నెల్లూరులో పాతికెలక్షల స్థానం స్థిరించామని ఆరేటి కోటయ్య చెప్పారు.

ఇంతే సంగతులు! ★





## కొంటె కాపురం

(9వ పేజీ కొరవ)

కానులు జవురుకోవడంలో అందెవేసిన చేయి ఆయనది. అయితే ఈచిత్రంలో మాత్రం అవన్నీ కృతిమించి, చిత్రాన్ని అక్కడక్కడా నవ్వులపాలు చేశాయి.

పెదవులపై దరహాసం, కళ్లలో కన్నీళ్లు ఒకేసారి చిప్పిల్లచేసే 'సున్నిత హాస్యం' సృష్టించగల నేర్పు, ప్రతిభ సామాజిక అవగాహన మన దర్శకుల నుంచి ఎటూ ఆశించలేము; అయితే చౌకబారు శృంగారంతో తప్ప వేరొకరకంగా హాస్యం పుట్టించడం చేతకాని దర్శకుల -తీరులి చూస్తేనే బాధేస్తుంది. జంటప్ప ...గుతుంది. పనిమనిషి రంగి దగ్గర నుంచి, సామెతల పిచ్చిగల్గిన వీరభద్రరావు పాత్రవరకు ప్రతి సన్నివేశంలో, ప్రతిదృశ్యంలో వెకిలి శృంగారాన్ని పలికించి తన 'సంస్కారం' బయటపెట్టుకున్నాడు దర్శకుడు. సంసారపక్షంగా వుండాల్సిన, వుండడానికి ఎంతోవీలున్న ఇటువంటి చిత్రాలనుకూడా సంసారంతో కలిసి చూడలేని స్థితికి దిగజారిస్తే తెలుగు సినిమాలకు నిజంగానే మంచికాలం రహిస్తుందంటారా?

వీరల పిచ్చి 'శ్రీమతి' పాత్ర మాత్రం కొంతనయం, సుందరంలో జ్ఞానోదయం కల్గించి, సతీమణిపై అనురక్తి జనింప చేయడానికి 'శ్రాద్ధం' పెట్టడం కన్నా, చక్కటి ఉపాయం తోచలేదా దర్శకుడికి? సెంటిమెంట్లతో నిండిన సగటు మానవుడి మానసిక స్థితికి శవాలతో చేసే క్రీడలు ఎప్పుడూ వినోదం కల్గించలేవు; ఆ ఊహకూడా భరించలేరు.

తెలుగు సినిమాకు బూతు ఒక భూషణంగా మారిపోయిన ఈ రోజుల్లో, ఇది పెద్ద నేరమేమీకాదని సర్ది చెప్పుకుంటే మాత్రం, కొంటెకాపురం మంచి కాలక్షేప చిత్రమే. చంద్రమోహన్ (సుందరం) అశ్విని (రాణి) ఇద్దరూ బాగానే నటించారు. గొల్లపూడి మారుతీరావు (కళ్యాణరావు) ఎంత సహజంగా చిత్రకథలో సంలీనమై ముచ్చటేశాడో, సుత్తివేలు (కోటేశ్వరరావు) అంత వెగటు కల్గించాడు.

సంగీతం, ఫోటోగ్రఫీ వంటి వాటికి ఇందులో ప్రాధాన్యతలేదు.

—శైలేంద్ర

## సినిమా

(9వ పేజీ కొరవ)

కూడా. తారలు, సాంకేతిక నిపుణులు, దర్శకులు, నిర్మాతలు ఎంతో బిజీగా ఉండవచ్చు. కళకు భాషా భేదంలేదని నిరూపించడానికి ఒక సత్కారసభ ఏర్పాటు చేస్తే దానికి తెలుగువారే ఎక్కువమంది గైర్‌హాజరవడమా? అని కొన్ని తమిళ పత్రికలుకూడా విమర్శించాయి. ఇది నిజంగా తెలుగువారికి సిగ్గుచేటు. ★

## నెల్లూరు సంగతులు

(4 వ పేజీ కొరవ)

అధ్యయనానికి మధుమలై అడవులలో విడుదులు ఏర్పాటుచేస్తుందట వారం రోజులుజరిగే ఈ అధ్యయన కార్యక్రమంలో పాల్గొనే ప్రకృతి ప్రియులకు భోజనం, వసతి అంతా వారేచూస్తారట. రుసుము చాలా స్వల్పం పోగాలని మీరు ం టీ. ఠాకూర్‌రెడ్డి 1/548 బంగ్లాతోట నెల్లూరు 2 చిరునామాకు వ్రాయండి.

### మునిసిపల్ ఉద్యోగులు

నెల్లూరు మునిసిపల్ మినిస్టీరియల్ ఎంప్లాయీస్ అసోసియేషన్‌కు నూతన కార్యవర్గం ఏర్పడింది. అధ్యక్షుడుగా శ్రీ పి. గోపాలరెడ్డి ఉపాధ్యక్షుడుగా శ్రీ మహమ్మద్ అహమ్మద్‌భాషా కార్యదర్శిగా శ్రీ ఎం ఎస్. రంగయ్య సహాయ కార్యదర్శిగా శ్రీ పి నాగలింగం కోశాధికారిగా శ్రీ ఎన్. రమయ్య, కార్యవర్గ సభ్యులుగా సయ్యద్ అహమ్మద్, పి రమేష్, టి. రాఘవేంద్రరావు, ఎ. రఘువయ్య, ఎం. భక్తవత్సలురెడ్డి ఎన్. నారాయణ, ఎం. చంద్రయ్య ఎన్నికైనారు.

## జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | 50-00 |
| అర్ధ సంవత్సరం చందా | 26-00 |

విడిప్రతి ఒకరూపాయి



రాజంపేట సబ్ కోర్టులో

E. P. No. 37/84

O. S. No. 24/84

1) హనుమంతు సుబ్బమ్మ

2) హనుమంతు సుబ్బలక్ష్మమ్మ

—పిటిషనర్లు (డిక్రీహోల్డర్లు)

హనుమంతు నరశింహులు- రెస్పాండెంట్

(జడ్జిమెంటు డెటారు)

పై ఇ. పి లో పిటిషనర్లు రెస్పాండెంటు మీద ఇ పి. బాకీకిగాను క్రింద కనుపరచిన ఆస్తిని యాలమునకు కోరియున్నారు. వాయిదా 11-6-86 తేదియున్నది. సవాలుదార్లు ఎవరైనా వున్న యెడల పై తెదిన కోర్టులో హాజరయి యాలం పాడుకోవచ్చును.

షెడ్యూలు : బద్వేలు తాలూకా మడకల వారి పల్లె గ్రామం పొలంలో ని జమీనులకు నెంబరు వారి వివరం

1) సర్కారు తరి డి. నంబరు 95 లో య. 0-40 సెంట్లు (0.161 హె.
పూరా క్రయం రూ. 4000/-

2) సర్కారు తరి డి. నం. 117/1 లో య. 0-74 సెంట్లు (0.296 హె)
పూరా క్రయం రూ. 7500/-

—వి. నాగరాజగుప్త
పిటిషనరు తరపు అడ్వొకేటు
రాజంపేట

కోవూరు సబార్డినేట్ జడ్జికోర్టులో

E. P. No. 36/86

Ongole O. S No. 106/79

పొతుల లక్ష్మీకాయమ్మ —డి.హో.

1. చేకూరు నరసింహంనాయుడు

2. చేకూరు దొరసానమ్మ —జె.డి.లు

- వేలం ప్రకటన -

ఈ నెంబరున డిక్రీహోల్డరు అయిన పోతు లక్ష్మీకాయమ్మ జె.డి.లు అయిన చేకూరు నరసింహంనాయుడు ... దొరసానమ్మల తాలూకు స్థిరాస్థిని వేలంకు తెచ్చియున్నందున తేది 5-8-1986 పై కోర్టువారి ఎదుట వేలం జరుగును ... ఆస్తిని కొనగోరు చేరుకుని కొన్నవారు సదరు తేదిన పబ్లిక్ వేలంలో పాటలు పెట్టుకొనవలసినదిగా ఇందుమూలముగా ప్రకటించడమైనది.

షెడ్యూలు: నెల్లూరు రిజిష్ట్రేషన్ జిల్లా బుచ్చిరెడ్డిపాళెం సబ్ రి. లో చేరిన కోవూరు తాలూకా సంగం కంద్రిగ గ్రామములో జెడిల హక్కు అనుభవము గల పట్టా నంబరు 198 సర్వే నం. 318 ... 11 29 కు 4 572 హెక్టార్ల మాగాణి భూమి డి హో కిమ్మత్తును 51,000/-
జమీనా కిమ్మత్తు రు 61,000/-

షరా : 1. ఈ ఆస్తి తేది 12-9-79 స్టేట్ బ్యాంకువారికి రు. 10 800/-కు ... వడ్డీకట్టి అనుమానం పెట్టబడియుండి సదరు అనుమానంకు లోబడి వేలంజరపబడును. 2. 15-1-1975 తేదిన కోవూరు సహకార భూమి అభివృద్ధి బ్యాంకుకు రు. 6,700/-కు 10½% వడ్డీ తనఖా వున్నది సదరు తనఖా లోబడి వేలం జరుపబడును.

—వై. జానకిరామయ్య
డి.హో. అడ్వొకేటు

# ** పెండ్లిండ్లు **

### మంత్రిగారి కుమారుడు

ఏ చిత్రమో గుర్తులేదుగాని రేలంగి నోట పలికించబడిన ఒకమాటమాత్రం బాగా జ్ఞాపకం —అయన అందులో రాణీ గారి సోదరుడు: ఆమాట చెప్పుకోవడం అతనికెంత గొప్పో పాపం. ప్రతి ఒక్కరిని రాణీ గారి తమ్ముణ్ణంటూ బెదరిస్తాడు. ఆ మాటలో సొంపు కాదుగాని, రేలంగి నోట ఆ మాటమాత్రం నవ్వుతో కడుపుబ్బిస్తుంది!

పోలిక కోసమో పరిహాసానికో [illegible] కాదిది: రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కుమారుని పెండ్లి అనుకోవడంలో ఆ వన్నెవేశం గుర్తుకొచ్చి ఉదహరించాము: అంతవరకే!

ముఖ్యమంత్రి శ్రీ రామారావు తాను ప్రాంతీయ తత్వాలకు అతీతుణ్ణని చాటుకోడానికి ఆంధ్ర - తెలంగాణా - రాయలసీమలనుండి పోటీచేసి గెల్చారు. వివాహ సంబంధాలద్వారా శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డికూడా ఆ అర్హతను సంపాదించుకున్నారు తన కుమార్తెను ఇవ్వడం ద్వారా రాయలసీమతో వియ్యమందారు; తన కుమారులలో ఒకరికి అమ్మాయిని తెచ్చుకోవడం ద్వారా తెలంగాణాతో బంధుత్వం కలిపారు; ఇప్పుడు మరో కుమారునికి సంబంధంద్వారా ఒకదెబ్బకు అనేక లాభాలు కలసివచ్చాయి స్వంత ప్రాంతం, స్వంతజిల్లా, స్వంత నియోజకవర్గం; వీటన్నిటికీ మించి మగపిల్లలు లేని ధనిక కుటుంబం. శీనయ్య స్ట్రాంగ్గా వున్నట్టుంటారుగాని, అసాధ్యుడే! తెలుగు గంగకు సంబంధించి తనపేర ఎవరైనా రంగం పెడితే, శ్రీనివాసులు రెడ్డి ఇప్పుడు ఆత్మవిశ్వాసంతో చెప్పుకోవచ్చు- తాను ప్రాంతాలకు, జిల్లాలకు అతీతుణ్ణని! కాదంటారా?

శ్రీనివాసులురెడ్డిగారి కుమారుడు రాజేంద్రకుమార్‌కు బి. ఎస్‌సి., కోవూరు భూమి అభివృద్ధి బ్యాంకి పాత అధ్యక్షుడు శ్రీ బుర్రా రంగారెడ్డిగారి తనయ అన్నపూర్ణతో 12 తేది ఉదయం నెల్లూరు టి. టి. డి. కళ్యాణ మండపంలో పరిణయం జరిగింది.

ముఖ్యమంత్రి శ్రీ రామారావు పెళ్ళి కోసం హెలికాప్టర్‌లో సూటిగా వూడిపడ్డారు; వచ్చిపోయె అన్నట్టుగావున్నింది ఆయన రాకపోక; ఇంత శ్రమపడి వచ్చి ఆయనవున్నది పదిహేనంటే పదిహేను నిమిషాలు హోంమంత్రి, వసంతునితో సహా మరో పదిమంది అమాత్యవర్యులు, వేలాది అహూతులు వివాహానికి విచ్చేశారు. ఈ అధికార, హూత ఆడంబరం తప్ప పెండ్లి ఏర్పాట్లు సింపిల్ అనే అనిపించాయి; అయినా ఆ ఏర్పాట్లు వరునికి సంబంధించినవికావు గదా!

అధికార యంత్రాంగ దుర్వినియోగమైందనే 'విమర్శ'లొచ్చాయిగాని: జరిగినాజాగ్రత్త పడకుండావుండేవారెవరండి?

### కావలి పెండ్లిండ్లు

కాంగ్రెస్ కుటుంబీకుడు, ఖద్దరు గోత్రీకుడు, నీతి నిజాయితీ నిలకడ విశ్వాసం వగైరా విలువలకు వారసుడు ఆయన పోతవిత్రగుంట మిత్రుడు శ్రీ కొరికపాటి గోపాలరెడ్డి ఒక్కదెబ్బకు రెండుపిట్టలన్నట్టు ఒకేసారి విద్యాధికులైన తన ఇద్దరు కుమార్తెలకు ఏప్రెల్ 30 తేది కావలి కలికి మల్లారెడ్డిసత్రంలో వివాహాలు చేశారు. నిప్పులు చెరిగే ఆ వాతావరణంలో గోపాలరెడ్డి ఆప్యాయతొక్కటే సేదదీర్చిన చల్లని వస్తువు!

పెద్దమ్మాయి హైమవతి ఎం. కాం.: రేణిగుంట, శ్రీ ఎం. రామమూర్తిరెడ్డి కుమారుడు, పెనుగొండ మునిసిఫ్ మేజిస్ట్రేటు షణ్ముగరెడ్డి బి. కాం., బి. ఎల్.

రెండవఅమ్మాయి శ్యామల ఎం.కాం., నెల్లూరు తాలూకా పెనుబర్తి శ్రీ జనపాక దశరథరామరెడ్డి కుమారుడు, హైదరాబాదు సి. ఎం. సి. లిమిటెడ్‌లో పని చేస్తున్న జనార్ధనరెడ్డి ఎం. ఎస్‌సి.

### మస్తానయ్య కుమార్తె

ఉన్నది ఏడాదిచిల్లరకాలమే అయినా గట్టి ఎం. ఎల్. ఎ. అనిపించుకొని, స్థానిక అన్నగారి గ్రహపాటుకు లోనై, తెలుగుదేశం అన్నగారి అభిమానానికి దూరమైన గూడూరీయుడు శ్రీ జోగి మస్తానయ్య తృతీయకుమార్తె కమలకుమారి; కలువాయి, శ్రీ మంగరెడ్డి చిన్నయ్య కుమారుడు రమణయ్య వివాహం 2 తేది గూడూరు డి. ఎజ్. ఆర్. కమ్యూనిటి హాలులో జరిగింది.

### అత్తివరపు వివాహం

మాదరాజు గూడూరు - కాంతమూర్తి, మితభాషి నాదునేదుకూడా ఒకటిగావుండే శ్రీ అత్తివరపు వరదారెడ్డి మనుమరాలు: అంటే, శ్రీ హరినాథరెడ్డి కుమార్తె కవిత; గూడూరు మునిసిపల్ మాజీవైస్‌ఛైర్మెను శ్రీ సిద్ధారెడ్డి వెంకటరామరెడ్డి తనయుడు రంగారెడ్డి వివాహం 8 తేది మధ్యాహ్నం నెల్లూరు టి. టి. డి. లో జరిగింది.

### శివరామయ్య కుమార్తె

నచ్చీలత, సేవాసక్త, నిరాడంబరత మూర్తీభవించిన స్టేట్‌బ్యాంకి కోవూరు బ్రాంచి మేనేజరు శ్రీ పసుమర్తి శివరామయ్య కుమార్తె లలిత; ప్రకాశంజిల్లా కొత్తపట్నం వాసి శ్రీ చివుకుల రాధాకృష్ణమూర్తి కుమారుడు, రైల్వే వుద్యోగి శ్రీనివాసమూర్తి కళ్యాణం 11 తేది నెల్లూరు మాదాల చాలతిమ్మయ్య కళ్యాణమందిరంలో జరిగింది.

### అల్లూరు పెండ్లి

అల్లూరు రిటైర్డ్ అధ్యాపకుడు శ్రీ కాటా ఆదిశేషారెడ్డి కుమారుడు నాగేంద్రరెడ్డి; ఇందుపూరు, శ్రీ యేలూరు రమణారెడ్డి కుమార్తె గిరిజ కళ్యాణం 1 తేది కావలి చేనేత వ్యాపారుల సంఘం హాలులో జరిగింది.

### రాపూరు పెండ్లి

శ్రీ నెల్లూరు వెంకటసుబ్బయ్య కుమారుడు, విజయవాడ వ్యాగన్ వర్క్‌షాపు ఇంజనీరు గోపాలునాయుడు; డివిజనల్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు శ్రీ కలిమిలి శ్రీనివాసరావు తమ్ముడు మోహనరావు కుమార్తె భార్గవి బి. ఎ. వివాహం 10 తేది రాపూరులో వధువు ఇంట జరిగింది.

### రంగ-జ్యోతి

ఈదులవారిపాలెం- శ్రీ కలికి బాలకృష్ణారెడ్డి పుత్రుడు రంగారెడ్డి ఎం.కాం., బి. ఎల్., కోడూరుపాడు, శ్రీ పామూరు సుబ్బారెడ్డి పుత్రిక జ్యోతి వివాహం 10 తేది నెల్లూరు టి..టి.డి.లో జరిగింది.

### హైదరాబాదు పెండ్లి

రామేగుంట శ్రీ దాసు సుబ్బరామయ్య కుమారుడు, ఇండియన్ బ్యాంకి-ఒంగోలు శాఖ ఆర్. డి. ఒ. సాయిప్రసాద్ ఎం ఎ. (అగ్రి); హైదరాబాదు, వాణిజ్యపన్నుల శాఖ డిప్యూటి కమీషనరు శ్రీ గంటా దశరథరామయ్య కుమార్తె పద్మావతి వివాహం 11తేది హైదరాబాదులో జరిగింది.

### ముత్తుకూరు-ముప్పాళ్ల

ముత్తుకూరు, శ్రీ నారాయణం రంగాచార్యులు పుత్రుడు శేషాచార్యులు; కందుకూరుతాలూకా ముప్పాళ్ల, శ్రీ పరాంకుశం కోదండరామాచార్యులుకుమార్తె స్వరాజ్యలక్ష్మి పాణిగ్రహణం 11తేది వధువు ఇంట జరిగింది.

### ఎక్సైజ్ వివాహం

నెల్లూరు, స్వర్గీయ సిద్దా సుబ్బరామిరెడ్డి తనయుడు, ఒంగోలు ఎక్సైజ్ సబ్ ఇన్స్‌పెక్టర్ త్రిలోకనాథరెడ్డి, లీల, వివాహం మేదరమెట్లలో ఇటీవల జరిగింది.

★



సంపాదకుడు ముద్రాపకుడు ప్రకాశకుడు ... నెల్లూరు-524001